# అథ అష్టమో%ధ్యాయః

# రథ నిర్మాణము

వ్యాస ఉవాచ |

సనత్కుమార సర్వజ్ఞ శైవ ప్రవర సన్మతే | అద్భుతేయం కథా తాత శ్రావితా పరమేశితుః || 1

ఇదానీం రథ నిర్మాణం బ్రూహి దేవమయం పరమ్ | శివార్థం యత్కృతం దివ్యం ధీమతా విశ్వకర్మణా || 2

వ్యాసుడిట్లు పలికెను -

తండ్రీ! సనత్కుమారా! నీవు సర్వమునెరింగిన వాడవు. శివభక్త శిఖామణివి. ఈశ్వరుని యందు లగ్నమైన మనస్సు గలవాడువు. పరమేశ్వరుని ఈ అద్భుత గాథను వినిపించితివి (1). బుద్ధిమంతుడగు విశ్వకర్మ శివుని కొరకు నిర్మించిన దేవాత్మకమగు పరమదివ్యరథము యొక్క నిర్మాణమును గూర్చి ఇపుడు వివరించుము (2).

సూత ఉవాచ |

ఇత్యాకర్ణ్య వచస్తస్య వ్యాసస్య స మునీశ్వరః | సనత్కుమారః ప్రోవాచ స్మృత్వా శివపదాంబుమ్ || 3

సూతుడిట్లు పలికెను -

ఆ వ్యాసుని ఈ మాటను విని మహర్షి శ్రేష్ఠుడగు ఆ సనత్కుమారుడు శివుని పాదపద్మములను స్మరించి ఇట్లు పలికెను (3).

సనత్కుమార ఉవాచ |

శృణు వ్యాస మహాప్రాజ్ఞ రథాదేర్నిర్మితిం మునే | యథామతి ప్రవక్ష్యే%హం స్మృత్వా శివపదాంబుజమ్ || 4

అథ దేవస్య రుద్రస్య నిర్మితో విశ్వకర్మణా | సర్వలోకమయో దివ్యో రథో యత్నేన సాదరమ్ || 5

సర్వభూతమయశ్చైవ సౌవర్ణస్సర్వ సంమతః | రథాంగం దక్షినం సూర్యస్తద్వామం సోమ ఏవ చ || 6

దక్షిణం ద్వాదశారం హి షోడశారం తథోత్తరమ్ | అరేషు తేషు విప్రేంద్ర ఆదిత్యా ద్వాదవైవ తు || 7

శశినః షోడశారాస్తు కలా వామస్య సువ్రత | ఋక్షాణి తు తథా తస్య వామస్త్యేవ విభూషణమ్ || 8

ఋతవో నేమయః షట్ చ తయోర్త్వే విప్రపుంగవ | పుష్కరం చాంతరిక్షం వై రథనీడశ్చ మందరః || 9

అస్తాద్రి రుదయాద్రిస్తు తావుభౌ కూబరౌ స్మృతౌ | అధిష్ఠానం మహామేరు రాశ్రయాః కేశరాచలాః || 10

సనత్కుమారుడిట్లు పలికెను -

వ్యాసా! నీవు గొప్ప బుద్ధిశాలివి. ఓ మునీ! రథము మొదలగు వాటి నిర్మాణమును గురించి వినుము. నేను శివుని పాదపద్మములను స్మరించి నా బుద్ధికి తోచిన విధముగా చెప్పెదను (4). అపుడు రుద్రుదేవుని కొరకు విశ్వకర్మ శ్రద్ధతో ప్రయత్న పూర్వకముగా సర్వలోకములను తనలో కలిగియున్న దివ్యరథతమును నిర్మించెను (5). సర్వభూతములు ఆ రతము నందు గలవు. ఆ బంగరు రథము అందరి ప్రశంసల నందుకొనెను. దాని కుడి చక్రము సూర్యుడు కాగా, చంద్రుడు ఎడమ చక్రమాయెను (6). కుడి చక్రమునకు పన్నెండు, ఎడమ చక్రమునకు పదహారు కమ్మీలు ఉండెను. ఓ బ్రాహ్మణ శ్రేష్ఠా! ఆ కమ్మీల యందు ద్వాదశాదిత్యులు అధిష్టించి యుండిరి (7). గొప్ప వ్రతము గలవాడా! చంద్రుని పదునారు కళలు ఎడమ చక్రము యొక్క కమ్మీలు అయినవి. నక్షత్రములు ఆ ఎడమ చక్రమునకు ఆభరణములైనవి (8). ఓ విప్రశ్రేష్ఠా! ఆరు ఋతువులు ఆ చక్రములను చుట్టి యుండు బద్దీలైనవి. అంతరిక్షము రథమునకు

ముందు భాగము ఆయెను. మందర పర్వతము రథములో కూర్చుండు స్థానమాయెను (9). అస్తాచల, ఉదయాచలములు రథమునకు ముందు ఉండు స్తంభములాయెను. మహామేరువు మూలాధిష్ఠానము కాగా, మేరు శిఖరములు అధిష్టానములోని ఇతర భాగములాయెను (10).

వేగస్సంవత్సరాస్తస్య ఆయనే చక్రసంగమౌ | ముహూర్తా బంధూరాస్తస్య శమ్యాశ్చైవ కలాస్మృతాః || 11

తస్య కాష్ఠాః స్మృతా ఘోణాశ్చాక్షదండాః క్షణాశ్చ వై | నిమేషాశ్చానుకర్షశ్చ ఈషాశ్చానులవాః స్మృతాః || 12

ద్యౌర్వరూథం రథస్యాస్య స్వర్గమోక్షావుభౌ ధ్వజౌ | యుగాంత కోటి తౌ తస్యా భ్రముకామదుఘం స్మృతౌ || 13

ఈషాదండస్తతావ్యక్తం బుద్ధిస్తసై#్యవ సడ్వలః | కోణాస్తస్యాప్యహంకారో భూతాని చ బలం స్మృతమ్ || 14

ఇంద్రియాణి చ తసై#్యవ భూషనాని సమంతతః | శ్రద్ధా చ గతిరసై#్యవ రథస్య మునిసత్తమ || 15

తదానీం భూషణాన్యేవ షడంగాన్యుప భూషణమ్ | పురాణన్యాయ మీమాంసా ధర్మశాస్త్రాణి సువ్రతాః || 16

బలాశయా వరాశ్చైవ సర్వలక్షణ సంయుతాః | మంత్రా ఘంటాః స్మృతాస్తేషాం వర్ణాః పాదాస్తదాశ్రమాః || 17

సంత్సరములు దాని వేగము ఆయెను. ఉత్తరాయణ, దక్షిణాయనములు చక్రముల ఇరుసులు ఆయెను. ముహూర్తములు దాని భూషణముకుటములాయెను. ఘడియలు దాని కీలలాయెను (11). విఘడియలు ముక్కువంటి అగ్రభాగములు కాగా, క్షణములు ఇరుసుకర్రలు ఆయెను. నిముషములు క్రింది కర్రలు కాగా, లవము (సెకండులో ఆరవభాగము)లు నిలువు కర్రలు ఆయెనని చెప్పబడినది (12). ద్యులోకము ముందుండే ఇనుపకమ్మీ ఆయెను. ఆ రథమునకు

స్వర్గమోక్షములు రెండు ధ్వజములు ఆయెను. అభ్రము (దేవగజము) మరియు కామధేనువు కాడి యొక్క కొనలు ఆయెను (13). ప్రకృతి నిలువు స్తంభము కాగా మహత్తత్త్వము వెదురు గడల ఆసనమాయెను. ఆహంకారము కోణములు కాగా, పంచభూతములు దాని బలము ఆయ్యేనని మహర్షులు చెప్పెదరు (14). ఇంద్రియములు ఆ రథమునకు అంతటా ఉన్న ఆభరణములు ఆయెను. ఓ మహర్షీ! శ్రద్ధ ఆ రథమునకు గమనము ఆయెను (15). గొప్ప వ్రతము గల ఓ మునులారా! అపుడు ఆరు వేదాంగములు ఆ రథమునకు భూషణముల కాగా, పురాణ న్యాయ మీమాంసా ధర్మశాస్త్రములు ఉపభూషణము లాయెను (16). బలమైనవి, సర్వలక్షణమలు గలవి అగు శ్రేష్ఠ మంత్రములు ఆ రథమునకు ఘంటలనియు, వర్ణాశ్రమములు పాదములన్నియు చెప్పబడెను (17).

అథో బంధో హ్యానంతస్తు సహస్రఫణభూషితః | దిశః పాదా రథస్యాస్య తథా చోపదిశశ్చ హ || 18

పుషరాద్యాః పతాకాశ్చ సౌవర్ణా రత్న భూషితాః | సముద్రాస్తస్య చత్వారో రథకంబలినః స్మృతాః || 19

గంగాద్యా స్సరితశ్శ్రేష్ఠా స్సర్వాభరణ భూషితాః | చామరాసక్త హస్తాగ్రా స్సర్వాస్త్రీ రూపశోభితాః || 20

తత్ర తత్ర కృతస్థానా శ్శోభయాం చక్రిరే రథమ్ | ఆవహాద్యాస్తథా సప్త సోపానం హైమముత్తమమ్ || 21

లోకాలోకాచలస్తస్యోపసోపానస్సమంతతః | విషమశ్చ తథా బాహ్యో మానసాదిస్తు శోభనః || 22

పాశాస్యమంతతస్తస్య సర్వే వర్షాచాలాః స్మృతాః | తలాస్తస్య రథస్యాథ సర్వే తలనివాసినః || 23

తరువాత వేయి పడగలతో విరాజిల్లు అనంతనాగుడు కట్టుత్రాడు ఆయెను. మరియు ఆ రథమునకు దిక్కులు, ఉపదిక్కులు కట్టు త్రాళ్ళు ఆయెను (18) పుష్కరాదితీర్థములు రత్నములచే

అలంకరించబడిన బంగరు పతాకము లాయెను. నాల్గు సముద్రములు ఆ రథమును కప్పి ఉంచు కంబళ్ళు ఆయెను (19) గంగానది శ్రేష్ట నదులన్నియు ఆభరనములన్నిటిని అలంకరించు కొన్న స్త్రీ రూపములను ధరించి వింజామరలను చేత బట్టి నిలబడిరి (20) వారు ఆయా స్థానములలో నిలబడి రథము యొక్క శోభను ఇనుమడింపజేసిరి. అవహాది సప్త వాయువులు దానికి ఉత్తమ సోపానములైనవి (21). లోకాలోకపర్వతము రథమునకు నలుపైలా ఉపసోపానమయెను. మానసాది సరోవరములు దానికి బటక ఉండే సుందరమగు విషమ స్థానము ఆయెను (22) వర్ష పర్వతములన్నియు ఆ రథమునకు నలువైపులా ఉండే త్రాళ్లు అయెననె చెప్పబడెను. పాతాళాది అధోలోకములయందు నివసించు ప్రాణులన్నియు ఆరథములకు ఉపరితములు అయెను (23)

సారథిర్భగవాన్ బ్రహ్మో దేవో రశ్మిధరః స్మృతః| ప్రతోదో బ్రహ్మణస్తస్య ప్రణవో బ్రహ్మదైవతమ్ || 24

ఆకారశ్చ మమచ్చత్రం మందరః పార్శ్వదంభాక్ | శైలేంద్రః కార్మకం తస్య జ్యా భుజంగాదిపతి స్వ్యాయమ్ || 25

ఘంటా సరస్వతీ దేవీ ధనుషశ్శృతిరూపిణీ | ఇషుర్విష్ణురన్మహాతేజా స్త్వగ్ని శ్శల్యం ప్రకీర్తితమ్ || 26

హయాస్తస్య తథా ప్రోక్తా శ్చత్వారో నిగమా మునే | జ్యోతీంషి భూషణం తేషామవశిష్టాన్యతః పరమ్ || 27

అనీకం విషసం భూతం వాయవో వాజకాః స్మృతాః | ఋషయో వ్యాసముఖ్యాశ్చ వాహవాహాస్తథాభవన్ || 28

స్వల్పాక్షరైస్సంబ్రవీమి కిం బహూక్త్యా మునీశ్వర | బ్రహ్మండే చైవ యత్ కించిద్వస్తు తద్వై రథే స్మృతమ్ || 29

ఏవం సమ్యక్ కృతస్తేన ధీమతా విశ్వకర్మణా | స రథాదిష్కారో హి బ్రహ్మ విష్ణ్వాజ్ఞయా శుభః || 30

ఇతి శ్రీ శివమహాపురాణ   రుద్రసంహితాయాం యుద్ధఖండే రథ నిర్మాణ కర్ణనం నామ అష్టమో%ధ్యాయః (8).

బ్రహ్మదేవుడు సారథియై కళ్లెములను పట్టు కొనెను. బ్రహ్మ అధిష్ఠాన దేవతగా గల ఓంకారము ఆ బ్రహ్మకు చేతి కొరడా ఆయెను (24). ఆకారము పెద్ద గొడుగు ఆయెను. మందర పర్వతము ప్రక్కన ఉండే నిలువు కమ్మీ ఆయెను. హిమవంతుడు శివునకు ధనస్సు కాగా, నాగరాజగు శేషుడు దాని నారిత్రాడు ఆయెను (25). వేదస్వరూపిణి యగు సరస్వతీ దేవి ఆ ధనస్సునకు గంట ఆయెను. మహాతేజశ్శాలి యగు విష్ణువు బాణము కాగా, అగ్ని ఆ బాణము యొక్క వాడి మొన ఆయెనని మహర్షులు చెప్పిరి (26). ఓ మహర్షీ! నాల్గు వేదములు ఆ రథమునకు నాల్గు గుర్రములు ఆయెను. మిగిలియున్న నక్షత్రాది తేజః పిండములు ఆ గుర్రములకు ఆబరణములాయెను (27). విషము నుండి పుట్టిన పదార్థములు సేన కాగా, వాయువులు వాద్యగాళ్లు ఆయెను. వ్యాసాది మహర్షులు ఆ గుర్రములకు సంరక్షకులుగా నుండిరి (28). ఓ మహర్షీ! ఇన్ని మాటలేల? కొద్ది మాటలలో చెప్పెదను. బ్రహ్మాండములో నుండే సర్వవస్తువులు ఆ రథము నందు ఉండెనని చెప్పెదరు (29). ఇట్లు బుద్ధిమంతుడగు ఆ విశ్వకర్మ బ్రహ్మ విష్ణువుల యాజ్ఞచే శుభకరమగు ఆ రథమును చక్కగా నిర్మించెను (30).

శ్రీ శివమహాపురాణములోని రుద్రసంహితయందు యుద్ధఖండలో రథ నిర్మాణ వర్ణనమనే

ఎనిమిదవ అధ్యాయము ముగిసినది (8).